Reg. No. 757.

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ
బ్రచురింపఁబడుచున్నది.
గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము 9 } 1917సం॥ ఏప్రిల్ { సంచిక 4

## విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0
పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0

చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురుపుష్పగిరిస్వాములవారు

2 రాజా బెల్లపురవలరాఘవేంద్రరావు బహద్దూర్,
జాగిరిదారుగారు, నవాబుపేట.

## పోషకులు.

1 పాములపాటి సుబ్బయ్యగారు, విలేజిమునసబు, నిడుబ్రోలు.

2 రాజానారయప్పారావు సింహాద్రప్పారావు బహదరు
జమీందార్లు, నూజవీడు.

3 రామసింగుగారు నెల్లుట్ల పావురపు సంస్థానము మేనేజరు, నెల్లుట్ల.

5 రాజా వాసిరెడ్డిచంద్రమౌళీశ్వరప్రసాదు బహదరుమన్నే సుల్తాన్
గారు, ముక్త్యాల.

6 అల్లాడి లక్ష్మణరావుగారు కరణం జంగపల్లి.

8 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు ముక్తాదారు చోల్లేరు.

9 అనంతరెడ్డి దేశాయిగారు పోతారెడ్డిపేట.

## సహాయులు

1 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోజకంపాడు.

2 చిప్రుకుల అప్పయ్యశాస్త్రిగారు, సికింద్రాబాదు

3 వెలుగూరి పిచ్చయ్యగారు కోదమగుండ్ల

4 కామసూను హనుమయ్యగారు నర్సారావుపేట.

5 బాకరాజా పరాంకుశరావు దేశముఖుగారు, యాడవరము.

6 పిల్లలమర్రి సోమనూజాలుగారు, తహసీలుదారు నరసారావుపేట.

7 మల్లాది కామయ్యగారు, చింతపల్లికోరసారి సంస్థానం గుంటూరు.

8 వెంకట నారసింహారెడ్డి దేశముఖుగారు-మిడికొడ్డి.

9 మెనను శేషారావు దేశముఖుగారు, వల్లబల్లి.

10 హోజీబు వెంకటరామారావుగారు వకీలు సిరిసిళ్ళ.

11 నరసింహారెడ్డి దేశాయిగారు, కాపరబాద.

12 పరాంకుశం శేషాచార్యులుగారు మానగిరి.

13 తూము నరసింహారావుగారు కట్టెంపూడి

14 ఉమ్మమళ్ళ గోపాలరావుగారు, కరణం, అమీనీపురం

15 ఉల్లగంటివీరరాఘవరావుగారు, ముక్తాదారు. ఆరేపురం

16 చీకటాయల రామారావు దేశముఖుగారు రామగిరి.

17 తోర్లకొండ హనుమంతరెడ్డిగారు పోలీసునగ్రాసీర్దారు, యల్లారెడ్డిపల్లె

18 శివపురపు వీరభద్రపాకయాజిగారు, సికింద్రాబాదు.

19 శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు తహశీలుదారు జగిత్యాల.

# అభినవసరస్వతి

సంపుటము. 9 { జానపాడు
పింగళ సం॥ చైత్రమాసము. } సంచిక. 4.

## కృ తి వి మ ర్శ న ము.

**ఆంధ్రదశరూపకవిమర్శనము.**—ఈవిమర్శనకారులు కొల్లాపుర సంస్థానపండితులగు వెల్లాల సదాశివశాస్త్రిలవారు. విమృష్టమైన యాంధ్రదశరూపకము రచించినవారు. సంస్కృత కవిజీవితాది గ్రంథకర్తలగు మల్లాది సూర్యనారాయణశాస్త్రిలవారు. ఇందు 32ఆక్షేపములు కావింపఁబడినవి. అందు 2మాత్రమిచటఁ గనఁబఱచెదము.

1. సంస్కృత దశరూపకము.—శ్లో॥ కామార్తాభిసరేత్కాంతం సారయేద్వాభిసారికా॥ దీనికి సూర్యనారాయణశాస్త్రిగారి యాంధ్రీకరణము. కామపీడితయగుచుఁదాఁ గాంతునెడకుఁ జక్కఁగాఁ బోవునది యభిసారికయగు॥ అని, ఇందుఁ బ్రథమపాదార్థముదప్ప ద్వితీయపాదార్థము పద్యశేషమందైనను గాన్పించదు-ఈయంశముంగూర్చి యుభయపండితులకును తీవ్రప్రత్యుత్తరములు నడచినవి. వానిలో సూర్యనారాయణశాస్త్రిగారు "గ్రంథవిస్తరభీతిచే రెండవలక్షణమును విడిచితి" నన్న జవాబుతో నూరకుండిన వివాదమే లేకపోయెడిది గాని తనతప్పు వెదకినవానితప్పు దామరల వెదకిఁ గాని సమానస్కంధుఁడఁ గాననికాఁబోలు "ప్రియు నభిసరింపఁజేయునదికూడ నభిసారిక" యని సదాశివశాస్త్రిగారుచెప్పిన ద్వితీయపాదాభిప్రాయము నాపించుచుఁ దదర్థము కాంతునిగూర్చి దూతిక నభిసరింపఁజేయునది-గాని యన్యము గాదని విలిఖించిరి-అందుమీఁద సంస్థానపండితుల విద్వత్తయుఁ బట్టుదలయు నట్లుండ సంస్థానప్రభువులుకూడ రసికులును సత్యనిర్ధారణకై పాటుపడువారును నగుటనియ్యది ప్రబలచర్చకు హేతువై విమర్శనగ్రంథమే బయలు వెడలవలసివచ్చెను-ఈయుభయ వాదములును సాంతముముగఁ జదివినవారికి ద్వితీయపాదమునకుఁ బ్రియు నభిసరింపఁ జేయునదికూడ నభిసారిక యనునదియే వాస్తవార్థమని తోఁచితీరును-గ్రంథవిస్తరభీతి నైనను యత్కించిదభిప్రాయని వేదకులకుఁ దగునుగాని గ్రంథ మాంధ్రీకరింపనే పూనిన వారికిఁ దగినపనికాదు-ఈపట్టున సూర్యనారాయణశాస్త్రిగా రెత్తికొనిన పద్యము తేటగీతి అందుఁ బూర్వార్థముతోఁ బూర్వార్ధము దెనిఁగించిరి-ఉత్తరార్థముతో నుత్తరా

ర్థము దెనిఁగించిన నాపద్యమున కెక్కువ యందమే వచ్చుచుండెను-అట్టిచో మఱి యెందుకువదలిరో తెలియఁబడదు ఎందుకేనివదలనిండు-దానికి గ్రంథవిస్తరభీతిచే నను మాత్రము ప్రత్యుత్తరము చాలియుండ ననవసరమగు వాదముఁ బెంచుకొని తమగ్రంథ మును విమర్శింపఁదగినస్థితిలోనికిఁ దీసికొనివచ్చిరి.

2. మూలము॥ వ్రీడేర్ష్యా రాగద్వేషప్రసంగతశ్చ॥ సత్పురుషాణాంచ లజ్జా, ఇతరేషాం త్వసూయానురాగాపహారేచ్ఛాదయః ప్రసజ్యేరన్-దీనికి సూర్యనారాయణశాస్త్రిగారి యాంధ్రీకరణము-"సత్పురుషులగువారికి లజ్జాసూయాదులుకూడ జనించును-" అని-ఈయాంధ్రీకరణము సరిగానున్నది లేనిది యత్కించి త్సంస్కృతభాషా జ్ఞానముగలవారికే సుబోధముకావునఁ దదా ప్రకటన మనవసరము. స్థాలీపులాక న్యాయమున నీరెండువిషయములు కనఁబఱచితిఁ గాని యిందు సదాశివశాస్త్రిగారు చూపిన దోషము లన్నియు సరియైనవనుటకు సంశయములేదు-ఈగ్రంథము వలయువారు కర్నూలుజిల్లా మూర్వకొండ పోష్టు కొల్లాపురపు సంస్థానపండితులగు వెల్లాల సదాశివశాస్త్రిగారికి వ్రాసిన నుచితముగానే పంపుచుండవచ్చును.

సత్యనారాయణచరిత్రము-ఇది సత్తెనపల్లితాలూకా ధూళిపాళగ్రామనివాసులగు కలువకొలను వెంకటప్పయ్యగారిచే రచింపఁబడిన యొక ప్రబంధము- స్కాందపురాణాంతర్గత రేవాఖండమందలిదని చెప్పఁబడెడి సత్యనారాయణవ్రతమాహాత్మ్యమునుబట్టి తెనిఁగింపబడిన యీకావ్యము శ్రావ్యమై యలరారుచున్నయది-సంస్కృతమందలి కథాభాగ మీషన్మాత్రమును వదలక వర్ణ్యాంశముల మఱింత పెంచి హృద్యముగ వ్రాయఁబడియున్నది-ఇక్కడి శ్లేషచ్ఛేకాది యుక్త్యాంశములలోఁ బూర్వకవులనడక కొంత నడిపించి యున్నవాఁడుకాని పద్యపూరణార్థమై చొనుపఁబడిన వ్యర్థపదములు మాత్రము తఱచుగాఁ గానవచ్చెడిని-అదియునుంగాక "యురుబేరములక్, బాంధవమునకు ఖలజైత్రవృద్ధికి, భీనురికె, కూతురుంగని. సంతతేచ్ఛ, తనయామ త్తల్లి మొదలైన దోషములు క్వాచిత్కముగఁ గానంబడెడిని-వి త్తమార్జించి ధనికోయను కందమున గణభంగముగన్పట్టెడు-ఇది ప్రామాదికమైయుండనోపు. ఈగ్రంథము వెల 0—6—0 వలయువారు గ్రంథకర్తపేర వ్రాసికొనవలయును.



క్రిందనుండినపండు నేచందమునను
మీఁదికిం జేర్ప నెవరికిం గాదు తరము॥ 51

ఆ॥ పండుపగులవలయుఁ బండులోపలివిత్తు
వలన మఱొకచెట్టు మొలవవలయు
పెద్దపెరుఁగవలయుఁ బెరిఁగి కాయవలయుఁ
గాసి యచట నుండఁ గాంచవలయు॥ 52

ఆ॥ అంతకార్యమైన యటువెన్కబై కేగు । నం తెగాని యింకనట్లుగాక
భూమినున్నపండు భూరుహశాఖపై । కేరహింరయంబచేరఁగలదు

క॥ ఈచొప్పున నేగవలె । నీచుఁడు పైజాతి, కు త్తనీతులవలనన్
నాచెప్పినపైసామ్యమె । వేచేకూరెడిని నేల? వి స్తృతియింకన్॥ 54

క॥ ముందున్ వెనుకం గాంచక । యెందో యొకముక్కఁ గాంచి యే మున్నీభీ
చందమున వ్రాసె, భారత। మం దేయీవిషయ మెల్లనల రెడిఁగనుగోన్॥

*ఉ॥ "శూద్రుఁడు సత్వనిష్ఠుఁడయి శోభిలెనేని భవాంతరంబునన్
శూద్రతవీడి వైశ్యుఁడయి చొచ్చిక్రమంబుగ క్షత్రదేహమున్
క్షుద్రత ద్రోవఁగం దుదకు క్షోణిసురుండగు" నంచు నున్న స
చ్ఛాద్రుని ధర్మవాక్యమును జూడుఁడు భారతమంద యుండెడున్॥

తే॥ "బ్రాహ్మణత్వంబు కడుదుర్లభం బనేక
జన్మములఁ బొంది తిరుగంగ సంభవించు
నపుడుగనునది" యనియున్న యట్టి భీష్మ
పలుకులం గూడఁజూడుఁ డబ్భారతమున॥ 57

క॥ ధర్మజ్ఞుండై మిక్కిలి, పేర్మోసియుఁ గౌశికాఖ్యపృథ్వీసురునకున్
ధర్మోపదేశియగునా । ధర్మవ్యాధునకుఁబోయతన మేమిటికో॥ 58

ఆ॥ ఎంతతపమొనర్చెనింద్రునుద్దేశించి। బ్రాహ్మణత్వమునకుఁ బాపమమ్మ
తంగుఁ, డంతయైనఁదత్సిద్ధియయ్యెనే।యతనికకట! వ్యర్థమయ్యెఁగాక॥

* భారతము-అరణ్యపర్వము-ధర్మవ్యాధుఁడు కౌశికునకుఁ జెప్పుట.

వ॥ సత్త్వగుణనిబద్ధుండగునేని శూద్రుండైనను జన్మాంతరంబున వైశ్యత్వంబునొంది క్రమంబున రాజ భూసురభావంబులు భజించి భవవిముక్తుండగు.

తే॥ * ఉండఁదగినన్ని గుణములు నున్నవాఁడు
జ్ఞాని సుఖదుఃఖములను సమానదృష్టి
నిష్పరిగ్రహుఁ డటువంటినీతిశాలి
యెట్లుకుయ్యెడెనో చూడుఁ డింద్రునొద్ద॥ 60
క॥ బ్రాహ్మణికడుపునఁ బుట్టియు
బ్రాహ్మణకర్మములశుద్ధిపఱుపఁగఁబడియున్
బ్రాహ్మణవీర్యుఁడుగామిని
బ్రాహ్మణ్యముఁబడయకతఁడు పరిభవమందెన్॥ 61
ఆ॥ విదురసంజయులకు విప్రుఁడున్ సరికాఁడు
నుడువఁబడిరె బ్రాహ్మణులుగ వారు
జనకుఁ డెంతజ్ఞాని, క్షత్రియత్వవ్యవ
హార మతనిఁ బాసి యరిగినదియె। 62
క॥ వేయేలనహుషుఁ డడిగిన। యాయా ప్రశ్నంబులకు ననుకూలముగన్
వేయుత్తరంబొసంగిన। యాయమనందనుఁడు మాత్రమలఁతియె తలఁపన్॥
క॥ తనుదానపోలుఁగాకే। మనవచ్చునజాతశత్రునతిశాంతతయున్
ఘనసత్యశీలములునే। జనులకువర్తిల్లఁ జెప్పుఁడు సౌజన్యనిధుల్!॥ 64
సీ॥ అతని సత్యంబున "కాచార్యసుతుఁ డీల్గె"
ననుట కొప్పకయుంటె యలఘుసాక్షి
అతని దయామతి కల సుయోధను కట్లు
విడిపించిపుచ్చుటే వింతసాక్షి
అతని శాంతాత్మత కతివ దుశ్శాసనుం
డీడ్వ నూరకయుంటె హెచ్చుసాక్షి
అతని దానంబున కరివచ్చి "శర" ణన్నఁ
బ్రేమచూపించుటే పెద్దసాక్షి
అట్టిసత్యశీలుఁ డట్టిదయాశాలి అట్టిశాంతమూర్తి యట్టిదాత

* భారతము-అనుశాసనికపర్వము. ఇంద్రమతంగసంవాదము. భీష్మః॥ మతంగో నామ నామ్నా వై సర్వైస్సముదితో గుణైః ...మాతంగః॥ ఏకారామో హ్యహం శక్ర! నిర్ద్వం

బ్రాహ్మణుండటంచుఁబలుకంగఁబడక యే
యేలక్షత్రియుఁడుగనెంచఁబడెనో

క॥ ఈయీ కారణములచే
నా యమనందనునిభావ మటుగాకయ యీ
నా యనినట్టులె యయ్యెడు
ధీయుతు లరయుండు సరిగఁ దెలియంబడెడిన్॥ 66

తే॥ వర్ణభేదములేక కేవలగుణముల
వలననే బ్రాహ్మణత్వాదు లలవడునను
వాదమున కించుకేనియు భారతంబు
సాధకముగాదు వ్యర్థప్రశంసతప్ప॥ 67

క॥ జాతివ్యవస్థయంతయు। నాతతముగ భారతంబునం దేయుండెన్
గీతలుపుట్టుటకుంగల। హేతు వెదోయరయుఁడార్యులింతకు మొదటన్

ఆ॥ జ్ఞానబోధ యంతగాఁ జేసి కృష్ణుండు
కడకు నెదివిధించెఁ గవ్వడికిని
"క్షత్రియుండవీవు సంగరక్రియ వీడఁ
దగ" దటంచునే కదా తలంప॥ 69

క॥ జ్ఞానముగల్గకపూర్వము
తానైనన్ క్షత్రియుండుతదనంతరమం
దైనమఱిబ్రాహ్మణుఁడుకా
కానరుఁడెటులయ్యెక్షత్రియత్వయుతుండే॥ 70

క॥ ఏజాతికిఁ జేరినజనుఁ
డాజాతికిదగినధర్మమతినిష్ఠ మెయిన్
దాజరుపనగునునైదవ
ప్రాఁజదువగుభారతంపుఁబద్ధతిఁజూడన్॥ 71

క॥ హైందవ పురాణములయం
దుం దిగు టనవసరమనుచుఁ దుద కమ్మునిభ

శ్లో॥ నిష్ఫలిగ్రిహాః। అహింసాదవ మాస్థాయ కథం నార్హామి విషరీతాం॥

హైందవమార్గ గంథంబే
యెందులకొ ప్రమాణముగను నీ కైకొనుటల్॥ 72
తే॥ "సృష్టికృద్వక్త్రబాహాదిసీమలందు
బ్రాహ్మణాదికవర్ణముల్ ప్రభవమగుట
తక్క హైందవుల పురాణతతిని బరఁగి
* పరఁగకుండెనుగాఁ బోలు భారతమున 73
ఆ॥ వర్ణసంకరంపువాదంబునకుసాధకంబటంచుఁగొనియెఁగానిదాని
వాస్తవముగనదియువర్ణవ్యవస్థాపనమునకే సుసాధనంబుచూడ 74
ఆ॥ కాదుబ్రాహ్మ్యమునకుఁ గతము కేవలశీల
మే యటన్నవాద మింతెకాని
శీలముం బరిత్యజించి యుండుఁడటన్న
బోధగా దిదంత భూసురులకు॥ 75
ఆ॥ మునిసి భనినలాగె మన కవశ్యంభావ్య
మైనయట్టిశీల మవలఁద్రోచి
"మేము బ్రాహ్మణులము మేముబ్రాహ్మణుల"మం
చెగురులాట కరము తగనిచేత॥ 76
కం॥ అబ్రాహ్మణులకు బ్రాహ్మ్యం
బబ్రాహ్మ్యముబ్రాహ్మణులకునలవడుననుటే
సెబ్రినుడికానితీర్పరి
దబ్రముమఱియేమియుండదనోక్తులలోఁ॥ 77
శా॥ జాతిబ్రాహ్మ్యము కల్గుమాత్రి మనకుఁ స్వర్గంబు రాఁబోవ, దా
జాతిబ్రాహ్మ్యము సార్థకంపడుటకై సత్యానృశంస్యాదికా॥
న్వీతంబౌ నిగమోక్తధర్మ మెపుడుఁ నిర్వర్తనీయంబు, త
దీ్రితిఁ వర్తిలమే నపార్థమగు భూదేవత్వ మీక్షింపుఁడీ॥ 78

---

* భారతము శాంతిపర్వము జనకపరాశరసంవాదము.
తే॥ పద్మభవ ముఖబాహూరు పాదసంభవములుగాన భూసుర రాజ వైశ్య శూద్ర
భావములు తారతమ్యసంప్రాప్తి నొందె జననదేశగుణంబుల మనుజనాథ!

ఉ॥ బ్రహ్మ ముఖాంబుజాతమునఁ బ్రిప్రథమంబునఁ గల్గినట్టి యా
బ్రాహ్మణజాతివారమయి భాసిలుచుండియు నాత్మనిష్ఠమౌ
బ్రాహ్మణధర్మముం గర మపార్థము సేసితిమేఁ నిజంబుగాఁ
బ్రాహ్మణనామధారుల మపాత్రులమున్ మన మాదు మారయన్

కం॥ నూటికిఁదొంబదిమందియు నూటిగమనలోననట్లుచూపడుటనెకా
గూటింప మొదలు వెట్టిరి సాటిజనుల్ మనలనిట్లు భూసురులారా! 80

ఉ॥ ఎల్లజగానకున్ గురుల,మెల్లకలల్ మన పెట్టెసొమ్ముల
గ్గెల్లజనంబులందుఁ గడు హేయులమై ప్రథమంబునుండియున్
మెల్లగ స్వీయధర్మములమీఁద నుపేక్ష వహించుచుంటనే
యెల్లమిఁజూపుచుండిరిటు లొజ్జ, ద్విజాతులు ! మేలుకాంచుఁడీ॥

క॥ బ్రాహ్మణతాసామ్రాజ్యము।బ్రహ్మమొదల్ మనకొసంగెఁబరిపాలింపన్
బ్రహ్మయొసంగినపదమో । బ్రాహ్మణజనులార! నిల్పఁబొల్లంబడుఁడీ

క॥ పృథివీదేవులమయ్యును
ప్రథమము మనమే యధర్మపరులమయిన దు
ష్పృథమగును " యథారాజా
తథాప్రజా " యనెడిరీతిఁ దక్కుజనంబుల్॥ 83

తే॥ విభునిచేత స్వధర్మంబుఁ విడువఁబడిన
నవనిసామ్రాజ్యమే జనులపహరింత్రు
బ్రాహ్మణత్వంపు సామ్రాజ్య పదవిమాత్ర
ముంత్రె మనము స్వధర్మంబు లుజ్జగింప॥ 84

ఉ॥ క్షత్రియవైశ్యశూద్రులును భూసురులేయయి పూర్వ మందుఁ ద
ద్ధాత్రిసుపర్వధర్మములఁ దప్పిచరించుటచేతనే యిటుల్
క్షత్రియవైశ్యశూద్రతలు దాల్చినవారఁట, న్యాయక యీ
చిత్రపుఁ బూర్వపక్షమును జేసెను, నేమివచింత మిచ్చటన్। 85

క॥§ ముందర బ్రాహ్మణులై యా।యందఱునున్ వారివారియాచరణముచేఁ
గ్రిందికి దిగుటలు భారత।మందేయుండెనఁటదియు యథార్థంబేయా

§ మహాభారతశాంతిపర్వము 180 వ యధ్యాయములోఁ బ్రపంచమంత్రయు

ఆ॥ ఉండుఁగాక దాని నొప్పదు వేదంబు
అందు నాల్గుజాతు లాదియంద
పుట్టినటులఁ జెప్పెఁ బురుషసూక్తంబుదా
"బ్రాహ్మణోస్య" యనెడి పదముచేత॥ 87
కం॥ ఇతిహాసము భారతమన
శ్రుతికిన్ స్మృతికిని బురాణసూక్తికినిం గ్రిం
ది తరగతిం జేరినయది
యితిహాసము, కావున నది యెటుచెల్లనగున్॥ 88
క॥ ఈయంశంబుం గూరిచి। నాయాశయమున్న విధమున నెతన చేతన్
వ్రాయఁబడియుంటఁ దీర్పున। న్యాయాధిపుఁ డిందుబద్ధుఁడై యుండఁదగున్
చ॥ వెనుక నతండు చెళ్ళపిళ వెంకటశాస్త్రులవారిసాక్ష్యమం
దున నెదొ యొక్క వాక్య పెడత్రోవగలట్టిదియుండ "వాడి యీ
తనదగు ప్రాజ్ఞసాక్ష్యమునఁ దాఁ గడు బద్ధుఁడుగాఁగ నుండనో"
నని లిఖియించె, నెట్టులిపుఁ డాతఁడు బద్ధుఁడుగాక యుండెడిన్॥ 90
క॥ నాపక్షంబునవచ్చిన। యే పండితు సాక్ష్యమునకో యే బాధ్యుఁడఁగా
స్వోపన్యస్తంబగునుడి। కే పగిదిం గాఁడు బాధ్యుఁడీ తీర్పరియున్॥ 91
క॥ పండితు పలుకులఁగానీ
పాండిత్యవిహీనజనుని పలుకులఁగానీ
యుండఁదగు శాస్త్రసమ్మతి
ఉండదనినాఁ డవి గ్రహింపకుండుదురు బుధుల్॥ 92
మ॥ అవుఁగా కాయన పండితుండు, మఱి నాకై సాక్ష్యముం జెప్పఁగా
కెవియుం జూపక యే ప్రమాణములఁ దా "నెల్లర్ మొదల్ శూద్రులై
అవలన్ వైశ్యులు క్షత్రియుల్ ద్విజులుగా నై రోజ" నన్నం దదు
క్తి వృథా నన్నెటు బద్ధుఁ జేసెడిని శాస్త్రీయంబు గాకుండుటన్॥93

మొదట బ్రాహ్మణులనియుఁ దర్వాత వారువారుచేయుపనులనుబట్టి యనేకజాతులవారుగా విభజింపఁబడిరనియు భృగుమహర్షి చెప్పెడిని. బ్రాహ్మణునకు గొప్పతనము నిచ్చునది పుట్టుకయే కాదు పైనిజెప్పిన గుణములుకలిగియున్న వాఁడే బ్రాహ్మణుఁడు

క॥ ఆమాడ్కిం జెప్పంబడు। ప్రామాణ్యము లేనినుడులె బాధించెడిచో
ప్రామాణ్యవిచారణకై। యేమనుచున్ దిగినవాఁడొ యీమున్సిఫుదార్ ॥

మ॥ నుడివెన్ వెంకటశాస్త్రి శాస్త్రహితముల్ నూ, అందులోనిద్ది యొ
క్కఁడె యిట్లుండెను, నుండుఁగాక, యొకవాక్యమ్మేమి బాధించు, నె
క్కుఁడువాక్యమ్ములు శాస్త్రదూరములు వాక్రుచ్చెంగ, శిష్టాన్వవా
యుఁడు మున్సీఫివె సత్ప్రమాణములుగా నెయ్యన్ గ్రహింపంగఁదార్

క॥ *శాస్త్రనిబద్ధములఁటయా
శాస్త్రులువచియించునట్టిసంగతులెల్లన్
శాస్త్రజ్ఞానంబుండుట
శాస్త్రులప్రౌఢిమనెఱుంగజాలెనుమున్సిఫ్ ॥ 96

---

(17) గుణములనుబట్టికాక పూర్వీకులనుబట్టియే బ్రాహ్మణత్వమును నిర్ణయింపవలయునసెడిది వాది వాదమైయున్నయది. ఇందువిషయమై యుభయపక్షములందును ననుకూలముగాను బ్రతికూలముగాను సాక్ష్యముచెప్పఁబడినది. నేను జేసెడివాదమునకు సాక్ష్యముతోఁ బనియేలేదు. వాదియుఁ బ్రతివాదులును బుట్టుకనుబట్టి వారిహక్కును నిల్పుకొనవలెనని యత్నించినారుగనుక వారివాదములనుగూర్చి యించుక హెచ్చరించుట యవసరమైయుండవచ్చును. మొదట ప్రతివాదికి దన్నుఁ బ్రస్తుతము వాదములో నున్న, శాస్త్రోక్తబ్రాహ్మణుఁడుగా జెప్పుకొనుట యభిమతమైయున్నది. వాది తిరిగి బ్రాహ్మణులచేఁ బ్రతిష్ఠింపఁజేయుటకుఁగాను గర్భులనుగోరుటవలన వారియుత్పత్తికూడ నాలోచింపవలసియుండును. ప్రతివాదులు నాలుగవకులముకంటెఁ దక్కువవారై యాజ్ఞవల్క్యస్మృతిలో సంకీర్ణసంకరులుగాఁ జెప్పఁబడిన రథకారజాతివారని వాది చెప్పుచున్నాఁడు. సూతసంహితలో రథకారులు సంకీర్ణసంకరులనియు వారివృత్తి వడ్రంగము కమ్మరము బంగారపుఁబని యనియుఁ జెప్పఁబడియున్నది. ప్రతివాదికులస్థు లావృత్తులచే జీవించుచుండుటచే రథకారులని చెప్పఁబడువారు వారేయని వాది వాదించుచున్నాఁడు. పుట్టుకవల్ల బ్రాహ్మణుఁడును బండితుఁడును నగు వాదితరపు 2 వ సాక్షి (శిష్టా సీతారామశాస్త్రి) సామాన్యముగాఁ గమసాలులనియెంచఁబడు ప్రతివాదికులస్థు లయొజ్జిబిటుయియా (యాజ్ఞవల్క్యస్మృతి) లోఁ జెప్పఁబడిన రథకారజాతివారని చెప్పుటకుఁ బ్రమాణ మేమియు లేదని చెప్పెడిని.

* ఆయన సాక్ష్యములోని సంగతులు శాస్త్రప్రమాణములని చెప్పుటకు వీలుగానున్నవి.

ఆ॥ § శాస్త్రిగారిదైనసాక్ష్యమాక్షేపింపఁ
జాలకుండిరంటసరిగ నెవరు
అరయనతనిసాక్ష్యమందునాక్షేపావ 97
కాశముండదంట లేశమైన॥

ఉ॥ కోరికివచ్చినట్టులుగ నూతననాగరికాళికిం బ్రియం
బారహిఁ నెవ్వియో నుడువు నాతనిసాక్ష్యమె ప్రస్తుతంబునన్
గౌరవపాత్రమయ్యె, కలికాల మహత్త్వముగాక యన్యమౌ
కారణముండఁబోవ దిటుగాపుటకుం దలపోసి చూడఁగన్॥ 98

ఆ॥ నెగడ రాజకీయనిర్బంధ మొకియింత
మూఁగవలసివచ్చె నంతెకాని
కాకయున్న శాస్త్రిగారివాక్యంబులు
ఖండితంబు లెట్లుగాకయుండు॥ 99

క॥ సరియగు విమర్శకత్వము
వరలఁగనీ యవ్విధమున వరలకపోనీ
నరపతిసంబంధ్యధికృతి
పరఁగుట నెదివ్రాయఁ జెల్లుభాగ్యం బుండెన్॥ 100

క॥ కనుకనె న్యాయాధిపుఁ డిటు
మన సీతారామశాస్త్రిమాటల నెల్లన్
ఘనవేదపు మాటలఁగా
పనిగొనితా వ్రాసినాఁడు బళియన జనముల్॥ 101

ఆ॥ తనదు హృదయమునకు ధర్మ్యంబులనితోఁచి
వ్రాసెనాతఁడటుల, వ్రాయుఁగాక
చదివి కలరికార్డు సత్యమున్ గ్రహియింప
నెవరు కొట్టినార లిప్డు మనను॥ 102

§ ఆయనసాక్ష్యము నెవరు నాక్షేపింపలేదు. వాదిచేఁగూడ నాక్షేపింపఁబడుటకు వీలులేదు ఈవిషయమై చెప్పఁబడిన గ్రంథములన్నియు నుదాహరించుటకువీలు కాదు. మొట్టమొదట భగవంతుఁడైన యాదినారాయణమూర్తి చతుర్ముఖములుగల బ్రహ్మగాఁ బుట్టినాఁడనియు నానాజాతులవారిని సృష్టించినాఁడనియు నీసాక్షి వక్కాణించును.

తీపైనమేల్పళ్ళు తిరుగు పెంపుడు లేళ్ళు
కుంచినాడు నెమళ్లు మంచిసిళ్లు
నాయంబుగల ప్రాళ్లు నాడెమైనరుమాళ్లు
బత్తుతాలిరుముళ్లు పసిడిగిళ్లు
కొల్వులనుమించు పెరుమాళ్లు గొనబుపేళ్లు
వంకరలు లేనితేరుగుళ్లు పాలు నేళ్లు
బెనసివిలు వెన్నకనుకరాళ్లు బెట్టువిళ్లు
బాళితావులనీజల్లు ప్రోలి మేళ్లు॥ 74

సీ॥ నీరైనకోటల మేటిపూఁదోఁటల
బోటులపాటల గోటు వెట్టు
బీరంపుదిట్టలఁ గారంపుఁ జెట్టుల
నీరంపుఁబట్టుల సౌరు వెట్టు
అనువైనతావులఁ దనివైనయావుల
గొనబైనచేవల గూడువట్టు
తీరైనతమ్ముల సారైనకొమ్మల
జారైనయమ్ముల గేరునట్టు
నట్టువలపట్టు మంచిగొనాలఁబుట్టు
గట్టిజెట్టులకొట్టు దొంగలతురట్టు
గుట్టుకోకొట్టు కట్టడిచెట్టలొట్టు
నెట్టులకు మెట్టు ప్రోలుహరాంబట్టు వెట్టు॥ 75

సీ॥ పరువులు వెరవులు పజలయందుననుంచి
మలక లల్మటలు తీఁగెలకు నలమి
పొడుగులు బెడఁగులు ప్రోలివాడలఁ జేర్చి
తోఁటకుటల్ గలగుటల్ దొరువుల|నిడి
నిక్కులు టక్కులు నెలరౌతులకు నింపి
లేములు వంకరల్ లేముల కిడి

ఏపులుఁ బ్రాపులు నెలమి మ్రాఁకులఁ జొన్పి
జంకులుఁ గొంకులు డొంకల కిడి
విసురు లుబ్బులు నేళ్లకుఁ బొసఁగఁజేసి
కొలలు దూఁగుట లల, బేరములకు నింపి
నీటు గోటులు వెలబోంట్ల పాటు సేసి
నలువ తన నేర్పుమైఁ బ్రోలి వెలయఁజేసె॥ 76

చ॥ వెలిచెలిఁగూడి ప్రాఁజదువు వెన్కకు ముందున కెచ్చుతగ్గులన్
బలుకుచు నీటిపుట్టువుని ప్రాపున మిన్కఁగడించి బోడిచా
ల్నెలవగురచ్చ మెప్పుగొని నేరుపుకాఁడన జేగురించు మో
ములుగల తాతనా నలువమొక్కల మెన్నరు ప్రోలిబాపనుల్॥ 77

సీ॥ పాల్గొంగనేస్తి యిర్వైపులఁ జేవగ
లాఁడు పేర్గల పేడివాఁ డొకండు
గొడ్డలిమోయుచు నడ్డైన బిగిదప్పి
కాననెలవరిపేర్వానె నొకఁడు
బడుగువాఁడేటిపుట్టు డిగె రాపస కేలు
వట్టికోన్ దెసపట్టుఁ బట్టెనొకఁడు
ఉడుకుచూపరి సాయ మొరులీయ ననిసేసె
గాలిదిండులజోడుకాఁ డొకండు
అనుచు వెన్నునిచెలి నగఁగొడ్డలిదాల్పు
నేటిచిఱుత విసపుఁగూటివానిఁ
దెగడి తేజుఁ జేవ దిటవుఁ దోడొందమి
గలిగి ప్రోలిఱేండ్లు గ్రాలుచుంద్రు

ఉ॥ పేరుకుబేరుఁ డియకయ వెచ్చముసేయక పెక్కురొక్కముల్
గూరిచి పాతియుంచెనఁట కూల్పనె, నేస్తికిఁ గూడుగుడ్డ నీ
నేరనివాఁడు, డాకడనె నిల్చును నాఁగను లిబ్బిగాయనిన్
దూఱుచు వీటిబేరు లిడుదు ర్పజ గోరినవాని నిచ్చలున్॥

శా॥ తోడుంగాలున వెన్ను నెద్దడిని పైదోడొండు ముక్కంటిపై
నాడంగల్గియుఁ గ్రుంక ముత్తులిడుతావై పైరువెట్టంగ మా
తోడా నింకను లోటుపాటగునె యెందున్ మాకునం చెక్కడా
పాడింబంటల నుండు రొప్పులగు కుప్పల్ ప్రోలికాపుంగముల్॥

ఉ॥ అంటని వేల్పుతోడ సరిదైన మగంటిమిఁ బోరి వెన్క మో
మొంట నెఱుంగనట్టి బలియుల్ నుడివోవని బీరమున్న బల్
దంటలు సామిపన్పుఁ దలఁదాల్చెడి మేటులు మొగ్గరంబు ల
న్నింటి నెఱుంగుజాణలయి నిక్కుచునుందురు బంట్లు ప్రోలిలోన్॥

చ॥ కలుముల గొప్ప నేమములఁ గ్రాలెడిచూలుల నిత్తె మొప్పలా
కులుకుల మేలిచెయ్వులను గూరిమినింపుచు ముద్దులీను పా
టల నిలువేల్పుకొల్పుల దిటంబగు సత్తెము తాల్మి గూడు ప
ల్కులఁ దగియుందు రెంతొ తళుకుల్ వలెపీటను గేస్తురాండ్రొగిన్

సీ॥ తాలిమి మేలిమిఁ దూలించు నెన్నడల్
జానైన క్రొత్తావులీను సొర్లు
మేలు సేలుమిటారి వాలువాల్చూపులు
సింగారముంగూర్చెడంగు పశార్లు
వెన్నెలపొన్నారి చెన్నెన్ను నవ్వులు
కచ్చులసడలించు హెచ్చువగలు
కూరిమియింపారు తీరైన పల్కులు
పెంపైనదిట్టంపుఁ బెన్ హొయళ్లు
కలిగి కులుకుల జిలిబిలిపలుకులొలుకు
విలువచెలువుల నెలకొను వలపుసొలపు
లలరుకలుముల జెలులయింపులు వెలుంగ
వెలయుఁ బ్రోలిని రోపడంతుల గుమురులు

సీ॥ బోటిరో! యిచ్చను బూబంతులమ్ముదే
పైఁడికొండ లవి చేపట్టఁదరమె

వెలఁదిగో! ఇదుదు నాపెనుపండుకొననిమ్ము
బంగారుటేఁగెదాపండువెలది
అవ్విరిబోటినా కంపెదే కొనెదను
మిసిమికానున్న నమ్మికనరాదు
నీకోరువెలఁగూర్తు నీకయిదండిమ్ము
నమ్మ మవ్వానిదాన నెఱులిడుదు
కొమ్మ!ముద్దుపొగడ నేనుగోర విలుతె
పొగడనన నిచ్చు టేలేను తగినవిలువ
అనుచు వలపులపలుకుల నతివలు బొజుఁ
గులకు మార్వల్కి పూలమ్ముకొందురీట 84

ఉ॥ గాలిది క్రిందుమీఁదెపుడుఁ గానకపాఱెడు నగ్గితోడు పైఁ
గ్రాలఁగ నేగు నేదెసయుఁ గాంచక మూలనె నక్కిఁ గంతుచుఁ
వ్రాలును జింక వేవెలుఁగువారువము ల్గన లెక్క కేడగుఁ
జాలునటంచు వాని నగఁజాలియుఁ ద్రిమ్మరు వీటిగుఱ్ఱముల్ 85

ఉ॥ ఏదెసనైనఁ గేల్మొగిచి యెక్కడనో యొకమూల డాఁగి, సొం
పేది తమంతఁ ద్రిమ్మరెడి పేరిమిపీడియు నేలబర్వు పై
నూఁదఁగనొప్పు నేనికల యొప్పిదముం బెనుగట్లు యున్కియుఁ
గాదని పోలియేచుఁగులు గ్రాలును నింగికిఁ బొంగి వేనవేల్ 86

ఉ॥ గందపుఁగొండఁబుట్టి యటఁ గమ్మని తావుల మూటగట్టి పెం
పొందెడి పాలవెల్లి చలువ వ్రాఁతగ సోర్ణగండ్లఁబట్టి లో
నం దిగి బోంట్ల పయ్యెదల నట్టులఁగొట్టి బెడంగు గుబ్బదో
యిం దగు చల్వవెట్టి సొలయించును జేడెల వీటితెమ్మరల్ 87

క॥ అట్టిగొనబైనసొరుల పుట్టుకయై క్రాలునట్టి ప్రోలికిదొరలై
చెట్టలకట్టడిఁగొట్టిన దిట్టలుకడలేనియసము దిటవుఁగలారుఁ 88

సీ॥ రేయుం బగళ్లేనిమాయిని వెల్లడి
నేప్రొద్దుసుదుమూక కెసఁగుచుండు

చెట్టతెగుళ్లన్ని నెట్టన మా(యును)
నెవనికి జోహార్ల నెఱుఁగుచుండ
ఒక్కొట్టిబండిక ల్లొనరిన సత తేజి
తేరెక్కి జగములఁ బాఱునెవఁడు
తమ్మిపుట్టువు వెన్నుఁ డమ్మికసామి యే
వేల్పునం దిమిశిరి పొల్పమీఱ
అట్టి యొజ్జని వేలుపు జెట్టిగొలము
నందుఁబుట్టిన మేల్మగల్ కందులేని
వారు బువివేల్పుకొల్పుల వరలి తేజు
సిగియును గల్గినట్టిజేం ఙ్లెసఁగు చుండ్రి 89

క॥ అటువంటివారిలోపల
దిటముచెలఁగు నిక్కమైన తేజుగలిగి బల్
దిటవరి త్రిశంకుఁడనుపే
రిటిజేనికొమరుఁడలరె హరిశ్చంద్రుఁడన౯

క॥ ఆనేలఱేఁడుగొనము ల మానికమైకల్లపలుకుమానికమైదా
ల్పనతిగడచినఁదప్పని నానాఁడులజాటఁబంచినగరులఁజొన్ప౯

క॥ నిక్కమె జగములుపుట్టఁగ
చక్కఁగఁ బెంపంగఁ జదుపఁ జాలునెనెడి ప
ల్కొక్కటి ప్రామిన్కలగమి
నెక్కుడనుచునమ్మి దానినే వెలయించె౯॥ 92

సీ॥ గరువంబుఁ దురితంబుఁ బరుసంబు జోలీక
పెరడంబుఁ దిరిపంబు దరికిఁ జేర్చి
అనిఁ జీలఁగనుజాలు పెనువాలు నెనయించి
తనడాలుమిను ప్రోలి మొనగఁ జేసి
గొనబారు తనసారుఁ గనఁజోరు పజఁదన్ని
తనవారి మొనవారి మనఁగఁ బెనిచి

నాయంబు సాయంబు రేయుంబవలుఁ బెంచి
ఆయంబు గాయంబు నరసి మెఱసి
నిత్తెమును సత్తెమునెయెత్తి హత్తనొత్తి
ఎద్దడులసద్దు నెద్దెస బిద్దఁ జేసి
ఎక్కుడగు నిక్కముల లెక్క స్రుక్కఁ జేసి
చాలఁగూర్మి హరిశ్చంద్రుఁ డేలెనేల॥ 93

సీ॥ విద్దెలవెలయించి సుద్దులఁగలిగించి
బిద్దెలనలయించి ప్రేమఁజూపె
వేల్పులగెలిపించి యల్పులఁదోలఁగించి
పోల్పులఁగులికించి పూన్కినెగడె
బత్తుల దరిఁజేర్చి సత్తులఁ బురిగూర్చి
మత్తులఁ బరిమార్చి మంచిగాంచె
ప్రుచ్చులఁ జోరనీక హెచ్చర్లఁగొనఁబోక
గచ్చులవెఱలేక క్రాలియుండె
రాగతనమును మోసంపు డాఁగుతనము
మొద్దుతనమును జెయ్యూల రద్దుతనము
ఉబ్బుతనమును బెద్దల రుబ్బుతనము
ప్రోలిలో లేకయుండంగ నేలెనతఁడు॥ 94

సీ॥ వ్రాఁతల వ్రేఁతలఁ జేఁతలమ్మేఁతల నేర్పైనవారుగా నెగడఁజేసి
పాటలనాటలఁ బాటులరాటులనింపైనవారుగా నెనయఁజూచి
విద్దెలసుద్దులఁబద్దులహద్దులనాణెంపువారుగానూనఁజేసి
పోరులఁ బేరులఁ దేరులసౌరుల హెచ్చైనవారుగానిచ్చమనిపి
పజలనెల్లరఁ దన సంతుపగిదిఁజూచి
పేర్మి పరువము మురిపెము పెనగొనంగ
బీతుఁగల్లయు నొంటెత్తు పేర్లుమఱచి
చాలఁగూర్మి హరిశ్చంద్రుఁడేలె నేల॥ 95

సీ॥ గుఱిదప్పకయ కార్లఁ గురియుచుండుసువాన
పంటలేటను రెండు పరఁగుచుండు
పడమటిగాడ్పు లెప్పటికైనఁ గనరావు
వెలసి తెమ్మెర లెప్డు వీచుచుండు
నాలుగుకాళుల నేలచూలుఁలఁబండ్లుఁ
బూలు నిత్తెముఁ గోయఁ బొంగుచుండు
పాడిపెంచ్చింతని పలికిచెప్పఁగరాదు
కలుపనుమాటయే కలవుగాంచె
అతనియేల్బడి నెన్నంగనౌనె యొరుల
కెన్నియో నాల్కలునుమోము లున్నఁగాని
యనఁగఁగీరితిఁగనియెలె నతఁడుతేఁడె
బువి హరిశ్చంద్రుఁడనెడి వేల్పుదొరగాక

సీ॥ నాలుగుసంద్రాల నడిమియేలికలెల్ల
రతనాలకానుకల్ రాణనొసఁగ
పలునాళ్లఁ బడివచ్చు తొలివిద్దెచదువరు
లాసతో ముత్తెంపుసేసలిడగ
కైతకూర్పరులు చక్కనిపద్దెపుంబ్రోవు
మగరాలతోమ్మిదిఁ దగనొసంగ
ఇదిమంచి చేయఁగా నెంతయు లగ్గని
మంతురు లేవేళ మలసికొలువ
వేలుపణిహాళ్లు వేగరుల్ చాలఁగొల్వ
నేలవేల్పులు దీవనల్ నెఱపుచుండ
తెల్లయేనుఁగుగల్గిన దిట్టవ్రోలె
నా హరిశ్చంద్రుఁడనెడి రాయండు వెలయు॥

సీ॥ ఒరులకెప్పుడు లగ్గు లొదవించునేకాని
మఱచి చీమలనైన బ్రమ్మగనీఁడు

వలనైనపెరచాన బసిఁడిఁ గాంచఁడుకాని
పగదెసనెల్లప్డుఁ దగిలిచూచు
చెడుకాఱుమ్మాటకుఁ జెవియొగ్గఁడేకాని
మొఱ్ఱలనాలింప మురియుచుండు
వెడఁగుకొంచెపుదార్ల వెడలఁజూడఁడుకాని
నిక్కంపుఁద్రోవల చిక్కనేగు

వెన్నుఁడే సిరిఁ, గల్మికి వేయిగంటి
సౌరున మరుండు, తేజునఁ జాయమగఁడు
ప్రొద్దుచూలిగిఁ, పాడి విప్రోప్పలియొజ్జ
ఆహరిశ్చంద్రుఁ బొగడంగనౌనె పుడమి॥ 98

చ॥ మొఱమొఱమేనియొప్పరులు మోటరిపెద్దలు పాలుమాలి పో
ర్వ్యాఱవరు పైకి లోనికిని గ్రిందికి మోరలుచాతు రున్నచోఁ
బెరలకునీరు కల్బోరుసుపెన్నెఱదాల్పులు వారలేల యుం
చఱిముఱి వాఁడివిడి బువియున్న త్రిశంకునిపట్టిఁ గైకొనెఁ॥ 99

సీ॥ వేసాలుపదివేయఁ జేసాచియొరువేడ
మాయుపుట్టముఁదాల్ప మరగఁడేని
మూన్నాళ్లఁ బగపట్టి పెన్నల్పుఁ జెగ జెట్టి
మున్నమ్ముగనుబట్టి తన్నఁడేని
దొంగకోడియు నిల్పురంగుచూపులచెల్వ
నంగ నచ్చరరచ్చఁ బొంగఁడేని
నీటిపుట్టువుపుట్టి సాటిజాలును నెట్టి
పాటిమిన్కల బట్టి చాటఁడేని

పెరుగుదొంగయు బూచులదొరయు వెల్ల
పూవురౌతును విన్బాటఁబోవువాఁడు
తేకువను గీటిణి గల్మిఁ దేజుచేత
నగును బురుడు హరిశ్చంద్రుఁడ నెడిదొరకు॥ 100

అనివ్రాసియున్నారు. చూచితిరా స్వాములవారిసాహసము? ఈయర్థము తప్పు. సరియైనదికాదు. పైశ్లోకమునకు వెనుకనున్నశ్లోకమును గనుఁడు. " శూద్రాయాం బ్రాహ్మణాజ్జాతః శ్రేయసాచేత్ప్రజాయతే అశ్రేయాం చ్ఛ్రేయసీంజాతిం గచ్ఛ త్యాసప్తమాద్యుగాత్ " అనఁగా బ్రాహ్మణుఁడుమున్నగువారు పూర్వకాలమున నితరజాతికన్యల వివాహముచేసికొనెడి యాచారమున్నపుడు బ్రాహ్మణుఁడు వివాహముచేసికొన్న శూద్రస్త్రీయందుఁబుట్టినకూఁతురు బ్రాహ్మణునే వివాహముచేసికొని యామెకును గొమార్తెయెపుట్టి యామెకు స్త్రీయె జనించి వారును నీవిధముగానే యేడుతరములవఱకు బ్రాహ్మణునినే వివాహముచేసికొనుచు వచ్చినట్టయిన నేడవతరమందుఁబుట్టిన బిడ్డలు బ్రాహ్మణజాతీయులగుచున్నారు. తరువాత మనస్వాములవారు గ్రహించినశ్లోకార్థమును గాంచుఁడు. " శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణ శ్చైతి శూద్రతాం। క్షత్రియాజ్జాతమేవంతు విద్యా ద్వైశ్యా త్తథైవచ " అనఁగా మీఁదఁజెప్పినట్లు కూఁతుయొక్క సంతతిమార్గముగా శూద్రకులమం దేడవతరములో బ్రాహ్మణునకుఁబుట్టినవాఁడు బ్రాహ్మణుఁడగుచున్నాఁడు. ఆశూద్రస్త్రీయందే బ్రాహ్మణునకుఁబుట్టిన పురుషసంతతి శూద్రత్వమునుబొందును. క్షత్రియునకు శూద్రస్త్రీయందుఁబుట్టిన స్త్రీసంతతి క్షత్రియునే వివాహముచేసికొనుచు వచ్చినట్టైన నైదవతరమందు క్షత్రియత్వమును, వైశ్యునకు శూద్రస్త్రీయందుఁబుట్టిన స్త్రీసంతతి మూఁడుతరములవఱకు వైశ్యునే వివాహముచేసికొనుచువచ్చినట్టైన వైశ్యత్వమును బొందును." అని యీశ్లోకార్థములు. ఈయర్థములనెల్ల మూలకునెట్టి సంకరజాతివ్యవస్థనుగూర్చి ముచ్చటించుప్రమాణములను గ్రహించి బ్రాహ్మణాద్యుత్తమజాతివ్యవస్థను నిర్ణయింపఁబూనుటఁజూడఁ గడు వ్యసనముగానున్నది. పోనిండు వీరు శ్రీదయానందులవారియం దెంతేని భక్తినుంచుకొందురుగాక. వారుచెప్పినదానినెల్ల " విస్సన్నచెప్పినదే వేదము"

న్నట్లునమ్మి పూర్వాపరసందర్భశూన్యములును ధర్మదూరములును శాస్త్రవిరుద్ధములును నగు వ్రాతలు వ్రాయఁదగునా ? తగదు. దీని కేమికాని యింతవఱకు విన్నవించినదానింబట్టి మనువు బ్రాహ్మణాది వర్ణచతుష్టయము పుట్టుకయందె విభాగింపఁబడినట్లు చెప్పినాఁడని స్పష్టమగుచున్నదికదా ? అగుచున్నది. కాని.

ఆపస్తంబసూత్రము వర్ణవిభాగము

కావించునపుడు "ధర్మాధర్మచర్యలవలన వర్ణము పరివర్తన మగుననెడి ఆపస్తంబసూత్రమును "ధర్మచర్యయా జఘన్యో వర్ణః" అను (2-5-11) దానిని నమ్మెదురా ? లేదా ? .........నమ్మెదరేని జన్మమువలన వర్ణమువచ్చుననుచున్నారేల ?" అనిమూర్తిగారు మన లఁ బ్రశ్నించలేదా ? దాని కేమిసమాధానమని కొందఱడుగవచ్చును. దానికిఁ బ్రత్యుత్తరమును వినుఁడు. మనమూర్తిగారీసూత్రార్థ మెఱుంగక శ్రీదయానందులవారు సత్యార్థప్రకాశ 114 పుటలో వ్రాసియున్న యాపస్తంబసూత్రార్థమును గొంచెముదీసి తమ ప్రశ్నార్ణవములో నెక్కించుకొన్నారు. కాని యాసూత్రముగాని దానితరువాతసూత్ర ముగాని బ్రాహ్మణాది చాతుర్వర్ణవ్యవస్థనుగూర్చి ముచ్చటించునవి యెంతమాత్రమును గావు. అవి ధర్మాధర్మచర్యలవలనఁ బ్రజలకుఁగ లుగు లాభాలాభములనుగూర్చి ప్రశంసించునవియై యున్నవి వానికి శ్రీస్వామివారు సర్వవిరుద్ధములగు నర్థములను గావించియున్నారు. వానిఁ బిదపఁ దెలిపెదము. ఇపుడు జన్మమువలననే వర్ణవిభాగము జేయవలెనని యాపస్తంబమహర్షి వ్రాసియున్న సూత్రములను గనుఁ డు. (ఆపస్తంబధర్మసూత్రము 1-1-4) "చత్వారో వర్ణా బ్రాహ్మణ క్షత్రియవైశ్యశూద్రాః" అనఁగా నాలుగువర్ణములుకలవు. అవి బ్రా హ్మణక్షత్రియవైశ్యశూద్రవర్ణములు. అనిచెప్పి యావెంటనే (.-1-5) "తేషాం పూర్వః పూర్వో జన్మతశ్శ్రేయాన్" తేషాం=ఆ బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులలో, పూర్వఃపూర్వః=తొలితొలి

వర్ణమువాఁడు, జన్మతః=పుట్టుకవలన, శ్రేయాన్—శ్రేష్ఠుఁడు, అని కంఠోక్తిఁగా నాపస్తంబుడు జన్మమువలననే వర్ణములుకలిగియున్నవని చెప్పియుండఁగా వీనినెల్ల మూసిపెట్టి మూలశంకరుఁడు (దయానందసరస్వతి) గారు తమ లోకవంచకత్వమును స్వాభిమానపరతను లోకమున నెలకొలుపుకొనుటకుఁగాఁబోలు వర్ణవ్యవస్థ కేవిధముననుసంబంధించని "ధర్మచర్యయా జఘన్యోవర్ణః పూర్వంపూర్వం వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ" అనుదానిని "అధర్మచర్యయాపూర్వోవర్ణః జఘన్యం వర్ణ మాపద్యతే జాతిపరివృత్తౌ" అనుదానినివ్రాసి యీక్రిందివిధముగా నపార్థములను లిఖించియున్నవారు. (చూడుఁడుసత్యార్థప్రకాశ 114 పుట) "ధర్మాచరణముచేత నికృష్టవర్ణములు ఉత్తమఉత్తమవర్ణములు పొందును. ఏవర్ణమున కెవడు యోగ్యుఁడో వాని నావర్ణమందు గడింపవలయును. అట్లె యధర్మాచరణముచేత పూర్వము అనగా ఉత్తమఉత్తమవర్ణములవారు తమకంటె నీచనీచవర్ణములను బొందుదురు. వారి నానీచవర్ణమునందె గడింపవలయును" అని వ్రాసియున్నారు. మనమూర్తిగా రావ్రాఁతనుఁజూచి "దానిని నమ్ముదురా? లేదా? నమ్ముదురేని జన్మమువలన వర్ణమువచ్చుననుచున్నారేల?" అని మనలఁబ్రశ్నించియున్నారు. పైధర్మసూత్రములకు విపరీతార్థములనుజేసి దానిని విశ్వసింతురా ? విశ్వసింపరా ? యని యడిగిన వివేకములవాఁ డెట్లువిశ్వసించఁగలఁడు ? ఆసూత్రముల కర్థములను వినుఁడు. ధర్మచర్యయా=స్వజాతిధర్మానుష్ఠానముచేత, జఘన్యోవర్ణః=తక్కువవర్ణమువాఁడు, జాతిపరివృత్తౌ=జన్మపరివర్తనమందు, (ఆజన్మముమాఱి మఱియొకజన్మమునెత్తునపుడు) పూర్వంపూర్వంవర్ణం=తనవర్ణమునకుఁ బూర్వమునందున్నవర్ణమును ఆపద్యతే=బొందును. (శూద్రుఁడు స్వధర్మానుష్ఠానముచేత మరుసటిజన్మమందు వైశ్యుఁడై పుట్టును. అట్లె వైశ్యుఁడు క్షత్రియుఁడై పుట్టును. అవిధముగనె క్షత్రియుఁడు బ్రాహ్మణుడై పుట్టును.) అధర్మచర్యయా=అధర్మానుష్ఠానముచేత, పూర్వోవర్ణః=పూర్వవర్ణమువాఁడు, జాతిపరివృత్తౌ=జన్మపరివర్తనమందు (ఆజన్మము

మాటి మరియొకజన్మమెత్తునపుడు) జఘన్యంజఘన్యంవర్ణం=తనవర్ణము కంటెఁ దక్కువవర్ణమును, ఆపద్యతే=పొందుచున్నాఁడు. (బ్రాహ్మణుఁ డధర్మానుష్ఠానముచేత మరుసటిజన్మమందు క్షత్రియుఁడై పుట్టును. అట్లె క్షత్రియుఁడు వైశ్యుఁడై పుట్టును. వైశ్యుఁడు నావిధముగనె శూద్రుఁడై జనించును.) అనియర్థము. ఈవిమర్శసారమే మన శ్రీ దయానందస్వాములుగాని వారిశిష్యులుగాని శాస్త్రమర్యాదల నతిక్రమించి తమయిష్టమువచ్చిన యర్థములతో గ్రంథములువ్రాసి శాస్త్రజ్ఞానశూన్యులగువారిని మోసపుచ్చి తమసంఘములోఁ జేర్చుకొన యత్నించువారని తేలుచున్నది. దీనికేమిగాని మూర్తిగారు మరల

భారతమువర్ణవిభాగము

తెలుపుట "యస్తు శూద్రో దమే సత్యే ధర్మేచ సతతోత్థితః, తంబ్రాహ్మణ మహంమన్యే వృత్తేనహి భవేద్ద్విజః" అనిచెప్పినది ఈమహాభారత వనపర్వమందలివాక్యమును విశ్వసింపరా? విశ్వసింతురా? విశ్వసింతురేని జన్మమువలన వర్ణమువచ్చుననుచున్నారేల ?" అని మనల నడుగుచున్నారు. ఇందుఁకుఁ బ్రత్యుత్తరము. ఈశ్లోకములోఁగొన్నియపశబ్దములు కనుపడుచున్నవి. అర్థము వారువ్రాయలేదు. వారెందుకీప్రమాణము గ్రహించినది తెలిసికొనుట కష్టముగానున్నది. అయిన నాశ్లోకములో శూద్రుఁడు సత్యధర్మములందున్నయెడ వానిని బ్రాహ్మణునిగాఁ దలంచెదను. ప్రవర్తనచేతనేకదా బ్రాహ్మణుఁడగుచున్నాడు, అనునర్థము తెలియవచ్చుచున్నది. ఈవచనము బ్రాహ్మణుని సత్యధర్మములందుఁ బ్రవర్తించుమనిచెప్పునుగాని సత్యధర్మములందు వర్తించినంతనె శూద్రుఁడు బ్రాహ్మణుఁడగునని చెప్పదు. అప్పుడు భారతము జన్మమువలననేవర్ణమువచ్చునను బోధ చేసియుండవలెను గదా? అగును.

అట్లుగాక శాంతిపర్వమున జనకపరాశర సంవాదమునందుఁ బరాశరుఁడు (296 అధ్యాయము) "సుక్షేత్రాచ్చ సుబీజాచ్చ పుణ్యో

భవతి సంభవః। అతోన్యతరతో హీనా దవరోనామ జాయతే। వక్త్రా ద్భుజా ద్బాహుభ్యాం పద్భ్యాంచైవాథ జజ్ఞిరే, సృజతః ప్రజాపతే ర్లోకా ఇతి ధర్మవిదో విదుః। ముఖజాః బ్రాహ్మణాస్తాత! బాహుజాః క్షత్రియాఃస్మృతాః। ఊరుజా ధనినోరాజన్! పదజాఃపరిచారకాః,చతు ర్ణామేవవర్ణానా మాగమః పురుషర్షభ ” ఇందులకుఁ గవిబ్రహ్మ యిట్లాంధ్రీకరణ మొనర్చియున్నవారు. “ పద్మభవ ముఖబాహూరుపా దసంభవములుగాన భూసుర రాజ వైశ్య శూద్ర, భావములు తారత మ్యసంప్రాప్తినొందె, జననదేశగుణంబులమను జనాథ ”ఇంతియెకాదు ఈతిక్కయజ్వ యనుశాసనికపర్వమున శివుఁడు పార్వతికి వర్ణాశ్రమా చారంబుల తెఱం గెఱింగించుపట్ల నిట్లు తెలిపియున్నవాఁడు. “ అజుఁడు ముఖ లోకహితార్థంబుగా బ్రాహ్మణులను సృజించి రాజులను వైశ్యు లను శూద్రులను గ్రమంబొనరంగఁ గల్పించె నాజాతులకు నోలి నత నిముఖము బాహులు నూరులు బదములు సంభవస్థానంబులగుటయుఁ దారతమ్య భాగినులగునని పార్వతి కాతండు తత్తదాచరణీయ ధర్మ ములును వినుము విస్తరించె ” అని స్పష్టముగా బ్రహ్మయొక్క ముఖ బాహూరుపాదములవలన బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు సృజింపఁబడిరనియు జన్మస్థానములనుబట్టి వారికి జాతితారతమ్య మేర్ప డినదనియు (శ్రీ) మహాభారతము పరాశరమహామునిముఖమునఁ దెలిపి యుండఁగా దీనినంతయుఁ గప్పిపెట్టి వర్ణవిభాగమునకు సంబంధములేని “ యస్తుశూద్రోదమే ” యనుప్రమాణము నమ్ముదురా ? లేదా ? నమ్మకురేని జన్మమువలన వర్ణమువచ్చుననుచున్నారేల ? అని యడిగె దరు. మాసమాధానసారము, వారిచ్చిన ప్రమాణము నమ్మెదము దానింబట్టి బ్రాహ్మణునికి సత్యధర్మవర్తన మవసరమని నేర్చుకొందు ము. కాని గుణకర్మలనుబట్టి వర్ణమువచ్చుననెడి మూర్తిగారి యభిప్రా యమును గౌరవించము, కారణము, అదిశాస్త్రవిరుద్ధమగుటవలననెయ ని చెప్పెదము. చెప్పుటయెకాదు జన్మవలననే వర్ణమువచ్చునని భారత ముచెప్పెఁ దానిని నమ్ముఁడని మాసోదరపుంగవులగు మూర్తిగారికి

సవినయముగ విన్నవించుచున్నారము. మూ మనవి వినకున్న వారివా దముపంచమవేదమగు భారతమునకు బాహ్యమైనదగునని విజ్ఞాపనము చేసి వారుప్రమాణముగాగ్రహించిన భారతములో నొకభాగమగు.

భగవద్గీతవర్ణవిభాగము

విషయమై యేమిచెప్పియున్నదో యించుక విచారించుచున్నా రము. మూర్తిగారు భగవద్గీత తమపక్షముననే యుపయోగించుచు న్నదనుటకై "మేము శ్రీకృష్ణునిభక్తులమని చెప్పుకొనువారు" చా తుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః॥ అనుదానిని నమ్మకపో యినచో వైష్ణవులెట్లగుదురు? నాస్తికులుకారా?" అని ప్రశ్నించి యున్నవారు. పై శ్రీకృష్ణవాక్యమును మనసోదరు లెందుకుఁ బ్రమా ణముగా గ్రహించిరో తెలియదు. అర్థము వ్రాయలేదు. అభిప్రాయ మైన నిచ్చియుండలేదు. వారీయకపోయినను గుణకర్మవిభాగమువలన బ్రాహ్మణ క్షత్రియవైశ్యశూద్రులు సృష్టులయిరని శ్రీకృష్ణభగవా నులు చెప్పియుండుటచే గుణకర్మలను బట్టి వర్ణవిభాగముగావింపఁబడిన దని యభిప్రాయపడినట్లు తోఁచుచున్నది! ఇది నిజమైనచో మనమూ ర్తిగారికి సృష్టశబ్దార్థము తెలియదని మనము చాటించవచ్చును. సృ ష్టమన సృజింపఁబడినదనియర్థముకాని విభాగింపఁబడినదనునర్థములేదు ఈసంగతి తెలియక యావచనము తమ కేమో యట్టె త్రవ్వి తలకెత్తు నను భ్రాంతినిఁజెంది స్మృతితప్పి తమప్రతివాదులను "చాతుర్వర్ణ్యంమ యాసృష్టం గుణకర్మవిభాగశః" అనుదానిని నమ్మకపోయినచో వైష్ణ వులెట్లగుదురు? నాస్తికులుకారా? యని ప్రశ్నపూర్వకముగాఁ జీవా ట్లువేయమొదలిడినారు. ఇందులకు మాసమాధానమిది. మేము శ్రీ కృష్ణభగవానులవాక్యమును నమ్ముచున్నాము. మేము వైష్ణవుల మే నాస్తికులముకాము. మేము విరుద్ధార్థములనుఁజేసి భగవద్గీతను బట్టి విరుద్ధాచారములను నెలకొల్పుటకుఁ బ్రయత్నించినపుడుగదా నాస్తికులమయ్యెదము? మేమిపు డాపనికిఁ బ్రయత్నించలేదు, ఇదివ

అను మేము వ్రాసియున్న శ్రుతిస్మృతిసూత్రేతిహాసవచనములనుబట్టి పైభగవద్గీతావచనమునకు మేముచేసినయర్థమే సమంజసమైయున్నది. ఈయర్థమునే శ్రీశ్రీ జగద్గురు శంకరభగవత్పాదులును నానందగిరులును నీలకంఠులును మధుసూదనులును శ్రీధరులును నభినవగుప్తాచార్యులును తమతమ వ్యాఖ్యానములందు వ్యక్తీకరించియున్నవారు. ఇంతటిమహామహుల వ్యాఖ్యానము లన్నిటిని ధిక్కరించి "అడుగున కఱువ దియాఱుతప్పులు" ండెడు మనమూర్తిగారి ప్రశ్నార్ణవమునుఁగని వీరుబోధించినపద్ధతిని వివేకముగల వారెట్లంగీకరింతురు? అంగీకరించిరేని మనసోదరులునుడివినపగిదివారద్వైష్ఠ్యులును నాస్తికులును నెట్లు కాకుందురు?

ఈసందర్భమున మనయార్యనారాయణ మూర్తిగారి కొకహెచ్చరికఁ జేయుచున్నారము. అదేమన? ఇంతవఱకు విమర్శనము వ్రాసినపిదప దైవవశమున శ్రీమ దద్వైతానంద తీర్థులను యతులు మాశికింద్రాబాదు పురమునకువచ్చిరి. తరువాత 1915 సంవత్సరమున డిసంబరు నెల 1వ తేదిని సాయంసమయమున మేము వ్రాసిన యీ "ప్రశ్నార్ణవాపోశనము" అను విమర్శనగ్రంథమును శ్రీవారికి వినిపించితిమి. వారు ముఖత్రాతయను నీక్రిందివిధమున సెలవిచ్చిరి. అదేమన? "నేనుచిన్ననాఁటనుండియు వేదాంతవిషయమున నాసక్తికలవాఁడనై యాగ్రంథములందే విశేషపరిశ్రమచేసియున్నవాఁడను. కావుననే శ్రీభగవద్గీతా తాత్పర్యదీపికాది వేదాంత గ్రంథములను రచించియుంటిని. ధర్మశాస్త్రములయం దేమియుఁ బరిశ్రమచేసినవాఁడనుగాను. మీరువ్రాయాది "ప్రశ్నార్ణవాసిపోశనము" సప్రమాణముగనున్నది." అని నింబట్టి శ్రీస్వాములవారు భగవద్గీతాతాత్పర్యదీపిక 56వపుటలో "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః" అనుశ్లోకమునకు "చాతుర్వర్ణ్యం=చత్వారోవర్ణాః బ్రహ్మక్షత్రవైశ్య శూద్రసంజ్ఞితాః గుణకర్మవిభాగశః— గుణాః సత్త్వరజస్తమాంసి, తద్విభాగేన తేషాం కర్మాణి

వక్ష్యమాణాని తద్విభాగేనచ మయా సమష్టిజీవరూపేణ సృష్టం కల్పితం, నతు సాక్షాన్మయా ప్రథమేక్షణేసృష్టం వర్ణవిభాగస్య కర్మవిభాగస్యచ వ్యావహారికత్వాత్" అని వ్రాసినవ్యాఖ్య ధర్మశాస్త్రాదులను జూడకయే వ్రాసినట్లు స్పష్టపడుచున్నది. కానవీ వ్యాఖ్యనాధారముచేసికొని మానారాయణమూర్తిగారు మరలఁ గొంతగ్రంథమునుఁ బెంచకవిరమింతురుగాత!

## విష్ణుపురాణము-వర్ణవిభాగము.

విష్ణుపురాణము తమవాదమును సిద్ధాంతము చేయుచున్నదని తెలుపుటకై మూర్తిగారు "శౌనకపుత్రులు నలుగురును నాలుగువర్ణములవారైనట్లు విష్ణుపురాణము వాయుపురాణము హరివంశమునందుఁ గలదు" అని సెలవిచ్చియున్నవారు. శౌనకపుత్రులనుగూర్చి యాపురాణము లేమిచెప్పియున్నవో యాచెప్పాటచే మనమూర్తిగారికిఁగలిగెడి లాభ మెంతయుండునో యీవిషయములను మూర్తిగారి యుక్తివాదమునకు సమాధానమిచ్చుపట్ల విశదీకరింతుము. అటఁజూతురు కాని యిపుడు విష్ణుపురాణాదులు వర్ణవిభాగముంగూర్చి యేమిచెప్పియున్నవో యించుకయాలింపుడు. (విష్ణుపురాణముఅ॥6) "బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రాశ్చ ద్విజసత్తమ పాదోరువక్షస్థలతో ముఖతశ్చ సముద్గతాః" అని మైత్రేయునితోఁ బరాశరమహాముని చెప్పియున్నవాఁడు. (ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు బ్రహ్మయొక్క ముఖబాహూరుపాదములవలన బయలు వెడలిరి) అనియర్థము. ఈశ్లోకార్థమువిని మనమూర్తిగారు తమపురాణద్వేషమును వెళ్ళఁగ్రక్కుటకై వెంటనే మొదటిపాదమున బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రులనుఁ గ్రమముగాఁజెప్పి రెండవపాదములో "పాదోరువక్షస్థలతో ముఖతశ్చ" అని చెప్పియున్నవాఁడుగాన బ్రాహ్మణులు పాదములందు క్షత్రియు లూరువులందును వైశ్యులు భుజములందును శూద్రులు ముఖమునందును బుట్టినట్లు వర్ణించియుండుటచే నీపురా

శక్యంబుగా,దైన సంయముల్ సిద్ధులు
భాగ్యవశంబునఁ బ్రకటితముగఁ
జేసి(రి,తత్త్వముం జె) ప్ప లేకుండియు
శ్రద్ధచే నధికారసరణికొలఁదిఁ
జెప్పు(చుందురు) పెద్దలు (క్షితితలమున)
(బగిఁ బరస్పరవైరుధ్య ముండుఁగాక
కపిలకాణాదు లొకరీతిగఁ నుడివిరి)
అదియు లోకోపకృతియయ్యె ననఘులార!॥ 26

సీ॥ శంభుప్రసాదైకసరణిచే వ్యాసుండు
సాక్షాచ్ఛివజ్ఞాని, సరవిఁ దత్ప్ర
సాదంబుచే నేను సాక్షాచ్ఛివజ్ఞాని
నగుదు, సందేహింపఁ (దగ) దుమీఁకు
మత్ప్రసాదమున సన్మాన్యమా విజ్ఞాన
యజ్ఞవైభవమెల్ల నమితభక్తి
సంగ్రహంబుగవిన్న జ్ఞానవంతులు కృతా
ర్థులు ముక్తు లైతిరి, దొలుత నేను
దీని నెవరికిఁ దెలుపలే దిది రహస్య
ముగను జెప్పెనువ్యాసుండు, జగతి నిదియె
సారములకెల్ల సారమై సరసమైన
దెపుడు గోప్యంబె చేయుఁడీ తపసులార!॥ 27

* కర్మవైభవము *

వ॥ మఱియుఁ గర్మయజ్ఞంబు కామ్యనిత్యనైమిత్తికంబులనఁ ద్రివిధంబగు, అందుఁ గామ్యంబునఁ గామ్యఫలంబును నిత్యంబున మన శ్శుద్ధియు నైమిత్తికంబునఁ బ్రత్యవాయనివృత్తి (ద్వారమున) నుపాత్త దురితక్షయంబు నగు, కామ్యయజ్ఞంబుల శ్రద్ధచేతం బ్రవర్తించువారలు మందభాగ్యులు, నిత్యనైమిత్తికంబుల శ్రద్ధచేతం బ్రవర్తించువారలు

మహాభాగ్యవంతులు, వారల కయత్నంబుగా ముక్తి సంభవించు, విధ్యుక్తంబులని సర్వయజ్ఞంబులు శ్రద్ధచేతఁ జేయువారలకు మంద ఫలంబగు, శివారాధనబుద్ధిని యజ్ఞంబులు శ్రద్ధచేతం జేయ శీఘ్రంబె ముక్తియగు, "నేను సాక్షిచ్ఛివుండఁ గర్తృత్వభోక్తృత్వరహితుండ" నని స్వానుభూతితర్కంబులచే నెఱింగి యజ్ఞకర్మంబులు శ్రద్ధచేతం జేసిన శివజ్ఞానం బపరోక్షంబగు, యజ్ఞరూపుండగు మహావిష్ణుని యజ్ఞంబునఁ జూచువారలు విజ్ఞానంబువలనఁ గైవల్యఫలంబునొందుదురు, ప్రాధాన్యంబుగా యజ్ఞంబులం దర్చనీయుండు మహేశుండెకాని యన్యుండు కాఁడని యెఱింగి యజించునాతండు విజ్ఞానంబునొందు, యజ్ఞంబుల బ్రహ్మవిష్ణ్వింద్రాదులఁ బ్రాధాన్యంబుగా మోహంబున యజించువారలు కర్మఫలంబునొంది సంసారంబున భ్రమించెదరు, అర్థంబున నామంబున మహాదేవుండనొప్పు నమ్మహేశ్వరుండు సాంబుండు సర్వజ్ఞుండు సర్వమహామఖంబులచే నిజ్యుండగుఁగాని యన్యులు గానేరరు, లోకంబున (నవిహితకర్మంబులును) శ్రుతిస్మృతిని(షిద్ధ) కర్మంబులును శివారాధనబుద్ధిం జేయ నిదియు మహామఖంబగు, నీశ్వరార్థంబుగాఁ బాపంబులు సేసిన నవియు బుణ్యంబులగు, నిది సత్యంబు, ఆర్ద్రంబగు కాష్ఠంబు శుష్కంబుఁ జేసి దహించు వహ్ని విధంబున నీశ్వరబుద్ధిఁ జేయు పాపంబును సుకృతంబై విజ్ఞానంబొసంగు నెంతయు. 28

తే॥ చెలఁగి విధ్యుక్తకర్మంబు సేయువారి
కిష్టమొనరించుటిది యాగ మెంచిచూడ
వారికిష్టంబుసేయనివారు పాప
సంగమునఁజేసి సంసారసక్తులరయ॥ 29

సీ॥ ధర దురాచారులౌ పురుషుల దోషంబు
లరయ కుపేక్షించు టది మఖంబు
బుద్ధార్హతాది ప్రసిద్ధ (ప్రతిమ) లందు
దైవంబులనుబుద్ధి దొఁగ మఖంబు

వైదికతాంత్రికవర్జిమై తనప్రజ్ఞ
నొకచోట దైవమంచునికి మఖము
తనబుద్ధిచేనైనఁ దాంత్రికవైదిక
(పద్ధతి) చేనైనఁ (బ్రతిమలందు)
దేవతాబుద్ధి యాస్తిక్యభావ మొప్ప
తారతమ్యంబు (గనునుండుఁ) దత్ఫలంబు
కాయికంబైనయజ్ఞ మీక్రమముగాఁగఁ
జెప్పితిని మీర లాసక్తిఁ జేయవలయు॥ 30

## వాచికయజ్ఞము.

తే॥ ఇంక వాచికయజ్ఞంబు నేర్పరింతు
శ్రద్ధచేతను వినుఁడుస్వశక్తిసహితుఁ
డును బరాత్పరుఁడును బ్రహ్మమునగు శివుని
వలనఁ బరమైనశబ్ద ముద్భవమునొందె॥ 31

కం॥ జ్యోతిర్మయమాదిపరమం బాతతసూక్ష్మంబఖండమయి యాధార
ద్యోతకమాఁబ్రాణులకును భాతిగఁబిండీకృతైకభావముఁగాంచున్

తే॥ అదియుఁ బరితప్తజాంబూనదాభమగుచు
బ్రహ్మనాడిని హృదయాబ్జపదముఁజేరి
వహ్నిగతి సూక్ష్మమగుచు విభక్తగరిమఁ
దగ శివాలయ బ్రహ్మరంధ్రింబుఁజేరు॥ 33

తే॥ అచటఁ బిండీకృతంబయి(యలరి)నిల్చు
సచ్చిదానందమూర్తియా శంభునందు
తానె విశ్రాంతినొందును మానులార!
అది తలంపఁగ యోగివేద్యంబు జగతి॥ 34

సీ॥ చెలఁగి స్వభావంబుచే నక్షరద్వయ
మైన యానాదంబు మానులార!

పరశక్తి కాధారపదమైన యాధార
మందు నాజ్ఞాచక్రమవలనుండు
స్థానంబునందునఁ బూని యూఁడవదైన
పూరకస్థానముం బు.శ్యానిలయ
మగు పరమాధారమందు నేకాక్షరం
బయి విలసిల్లు నత్యద్భుతముగ
ఇదియె పరమాదిరూపమై యెసఁగుమంత్ర
మిదె ప్రసిద్ధంబు,మననమై యిష్టగతిని
త్రాణమొనరించుచుంట మంత్రిత్వమొందె
(శౌనకాది మహామునిజనములార!) 35

క॥ ఆదిమ(మనువగుదీననె। కాదేజనియించె మాతృకాదేవితగఁ)
ప్రోదిని రేచకపూరకమై దగితాఁగ్రిందుమీఁదునై నడచుఁగదా 36

క॥ అటుగనుక(మంత్రమాతయు)
నటియింపుచు(నాద్య)మంత్రనామముదాల్చెఁ
పటువృత్తి మొదలిమంత్రిం
బటులయ్యును సుప్రసిద్ధమైనప్పటికిఁ 37

వ॥ గురుని మహోపదేశమునఁ గూడికగల్గుచు,శాస్త్రకోటులఁ
దొరకదు,మంత్రిరాజమది దుఃఖనికృంతన చిత్ప్రకాశుఁడే
పరశివు వాచకంబగుట భవ్యతరంబగు, నింతకంటెనుఁ
బరమగుమంత్రముల్ గలవె బంధవిమోచన మాచరింపఁగఁ 38

క॥ ఇదిసత్యంబిదిసత్యం బిదిసత్యమటంచుబాహులెత్తి వచింతుఁ
ఇదిగాదెశివునిరూపము గదియించు నుపాసనంబుగావించినచోఁ

మ॥ పదిరెండేడులు శిష్యు నిత్యమును బెంపారం బరీక్షించి త
ద్ధృదయంబుంగని యీశ్వరాజ్ఞ నిది దా నీయందగుఁ,లేనిచోఁ
గదియుఁ మృత్యువు,వాని పుణ్యఫలముల్ కష్టంబులై కూలు,నే
నిది వర్ణింపఁగలేను, దేవమును లయ్యాశుండునుం జాలరా॥ 40

సీ॥ మాతృకేశ్వరి మహామంత్రమాతృక బుద్ధి
(మఱి విభక్తిగనయ్యె మధ్యమయయి
క్రమభేదమున వేదకలితశబ్దాకార
పటుమంత్రరూప విభక్తియగుచు
సంఖ్యేతరంబైన శబ్దజాలంబెల్ల
తానయై తనయంతఁ దానవెలసె
శివుఁడొక్కఁడయ్యును శివశక్తిభావంబు
నొందినరీతిఁ దా నొక్కటయ్యు
వెలయు హసకారములనఁగ ద్వివిధమగుచు
వరుస శివభక్తివాచకత్వమునహించె
కడిమి విద్యాత్మయై పదగామియయ్యె
నపదపదముల భేదంబు నరయ (యుఁడింక)॥ 41

వ॥ మఱియు నపదంబు పదంబయ్యెఁ బదం బపదంబయ్యె, నపదాపదవిభాగం బెవ్వఁడెఱుంగు నాతండె (పరశివస్వరూపం బై) ఱుంగుఁగాని యన్యు లెఱుంగరు, పదాభ్యాసరతుల కొక్కింత దుర్లభంబు లేదు, పదం బనేకమాత్రాకృతియగు, లోకోపకారంబుగా నీపదాంశ మొక్కటియె పదియాఱు నైదు రెండునై క్రమంబుగా స్వర వర్గాంత స్థోష్మాణ భేదంబయ్యె, (షోడశస్వరాత్మకమగు నీపూర్వాంశమె) సానునాసిక నిరనునాసిక భేదంబున (ద్విగుణితంబై) ద్వాత్రింశద్భేదంబయ్యె, మఱియుఁ గాదులు యాదులుం గూడి ముప్పదిమూఁడు విధంబులయ్యె, స్వరవ్యంజనభేదంబున రెండువిధంబులై పదంబు లోకోపకారంబుకొఱకు బహువిధంబయ్యె నిందు నొక్కొక్కవర్ణంబె మంత్రరూపంబుగా నుపాసితంబై యిష్టార్థంబొసంగు, కొందఱు వైదికాకారంబులును గొందఱు తాంత్రికాకారంబులును, గొందఱు లౌకికాకారంబులగు పదంబులనుపజీవింతురు, సర్వులును మహాదేవునింబోలె భూతపంచకం బీశశక్తినింబోలె సకలప్రాణులు పదాకారంబుల నుపజీవింతురు, అమ్మహా

దేవియగుమాతృక స్వపదాకారంబులఁ దానె భేదింపంబడివివిధకరణంబులచేతఁ దానె వైఖరీరూపంబయ్యె, సూక్ష్మరూపంబుచేత బ్రహ్మవిష్ణ్వాదుల కచింత్యయు వాచామగోచరయు, నమిత తేజస్కుఁడగు శివుని శక్తియగు మాతృకాదేవి స్థూలసూక్ష్మసూక్ష్మతర భేదంబునఁ ద్రివిధంబై చిన్మయయై పరచిద్రూపుండగుశివునకభిన్నయై ప్రకాశించుమఱియును.

తే॥ మంత్రవైభవ మీలీల మది నెఱింగి
గురుముఖంబునఁ గైకొని కోటి జపము
సేయ వేంగబె సిద్ధియౌఁ జెప్పనేల
అది గురురహితమైనను హానిదెచ్చు॥ 43

## ॐ ప్రణవవిచారము. ॐ

తే॥ సంగ్రహంబుగ విస్తారసరణిగాఁగ
ప్రణవమాహాత్మ్య మింక నేర్పడ వచింతు
ద్వివిధమగుఁ బరాపరవిభాగవిధిఁ జూడ
పరము (బ్రహ్మము)శబ్దం బపరము దలఁప॥ 44

వ॥ మఱియుఁ బ్రకర్షంబున నవంబగుటను బరబ్రహ్మప్రాప్తి హేతువగుటను బ్రణవంబను నామంబుగలిగి పరబ్రహ్మ శబ్దబ్రహ్మరూపంబులఁ బ్రణవంబు విరాజిల్లు నెంతయు. 45

సీ॥ మును ధాత శ్రద్ధాసమున్నతి భస్మాంగ
రాగుఁడై నిర్గతరాగుఁడగుచు
మహితత్రిపుండ్రాంక సహితమస్తకుఁడౌచు
లలితవల్కల జటాకలితుఁడగుచు
విజితేంద్రియక్రోధవృజినుఁడై పంచాగ్ని
మధ్యస్థుఁడై సాంబు మహితమూర్తి
ధ్యానంబు సేయుచుఁ దపము మూఁడేఁడులు
తాఁ జేసి తత్ఫలంబుకలిమి

వసుధ నంతరిక్షంబు దివంబు సృష్టి
చేసి పావకానిలములఁ జెలఁగు సుష్ట
కరుని క్రమముగ వీనిపైఁ గలుగఁజేసి
వేదములుమూడు వీనితో వెలయఁజేసె॥ 46

తే॥ వేదములమూటిచేతను విశదముగను
వ్యాహృతులుమూడుఁ గల్పించి వరుసగాఁగ
వానివలన నకారాదివర్ణములను
కల్పనముసేసి కలపనోంకారమయ్యె॥ 47

తే॥ భవుఁడు సాంబుండు సర్వావభాసకుండు
ప్రణవమందునఁబ్రతిబింబభావమొందు
అదియు శివవాచకంబగు, నభవునకును
అది యభేదంబు తప్తలోహంబువోలె 48

వ॥ మఱియు నీప్రణవశబ్దంబునకు వ్యుత్పత్తు లనేకవిధంబులం గలిగియుండు, (సర్వావభాసకంబగు నీప్రణవమంత్రంబుజపించిన ద్విజుఁడు సర్వమంత్రజపఫలంబుం బొందెడి)నట్లుగావున సర్వ(మంత్రంబుల)ను బరిత్యజించి యిదియ జపంబుచేయవలయు.దీనికి బ్రహ్మ ఋషియును గాయత్రి ఛందంబును బరమాత్ముండగు శివుం డధిదేవతయు బిందుయుక్తంబగు నకారంబు శక్తియు నుకారమకారద్వయంబు బీజంబును మోక్షార్థంబు వినియోగంబును,నీ యకారోకార మకారంబులకుఁ గ్రమంబుగా నగ్ని వాయు సూర్యులుమునులు, గాయత్ర్యనుష్టుప్ బృహతులు ఛందస్సులు, బ్రహ్మ విష్ణు రుద్రు లధిదేవతలు,రక్త శుక్ల కృష్ణంబులు వర్ణంబులు,జాగ్రదాదు లవస్థలు,భూ మ్యంతరిక్ష స్వర్గంబులు స్థానంబులు, నుదాత్తాదులు స్వరంబులు, మఱియునీమూఁడువర్గంబులకుఁ గ్రమంబుగా వేదాగ్ని కాల గుణత్రయంబులును సృష్టి స్థితి సంహారంబులునుం జెప్పంబడు,నంగుష్ఠాది కనిష్ఠాంతం బంగుళిసంధులఁ గ్రమంబుగా వర్ణత్రయన్యాసంబుసేయవలయు, సర్వాంగుళులయం

దుఁ బ్రిణవన్యాసంబు సేయవలయు,భూరగ్న్యాత్మనఇత్యాదిమంత్రంబుల చేనైన నంగుళన్యాసంబు సేయవలయు నాభి హృ న్మూర్ధంబుల వర్ణత్ర యన్యాసంబు సేయవలయు,నివ్విధంబుగాఁ ద్రిలోచనుండగుసాంబుని ధ్యానంబు సేయుచు లక్షదశకంబు జపంబు సేయవలయు,నంత మంత్రిసిద్ధి యగు,షట్కర్మసిద్ధియు నష్టవిభూతులు నపవర్గంబునుం గల్గు,సర్వపా పవిముక్తుండయిసర్వవిద్యాలయుండై యభీష్టఫలంబులం జెందునెంతయు.

## *గాయత్రీవిచారము.*

వ॥ ఇంక శిరోవ్యాహృతిసహితంబుగా గాయత్రీమంత్రంబు వచించెదభూరాది సప్తవ్యాహృతులకుఁ గ్రమంబుగా నత్రి భృగు కుత్స వసిష్ఠ గౌతమ కశ్యపాంగిరసులు ఋషులు, గాయ త్ర్యుష్ణి గనుష్టు బ్బృహతీ పంక్తి త్రిష్టు బ్జగత్తు లేడును ఛందస్సులు, నగ్ని వాయు సూర్య వాగీశ వరుణేంద్ర విశ్వేదేవు లధదేవతలు. సర్వత్ర వినియోగంబు, నింక గాయత్రికి విశ్వామిత్రుండు మునియును గాయత్రి ఛందంబును దేవత సూర్యుండును, దీనికి శివుం డధిదైవతం బగు, త్రిపదయైనగాయత్రి షడ్వర్ణంబులఁ జతుష్పదయగు, జపంబు నందుఁ ద్రిపదయ వినియోగింపఁబడు నింక గాయత్రీశిరస్సునకు ముని బ్రహ్మయు ఛందం బనుష్టుప్పును దేవత పరమాత్మయు యభీష్టసాధ నంబౌదు వినియోగంబును నగు, నీసావిత్రి త్రిపదయుఁ బంచశీర్షయు షట్కుక్షియు నగ్నిముఖయుఁబుండరీకేక్షణయు,(ఋగ్యజుస్సామంబులు మూడును మూఁడుపాదంబులై)విరాజిల్లు, నీసావిత్రికిఁ బూర్వ దక్షిణ పశ్చి మోత్తరోర్ధ్వాధోదిశలు షట్కుక్షులును నష్టాదశపురాణంబు లు నాభియును నగు, జగంబు శరీరంబును నాకాశం బుదరాంతరంబు ను ఛందస్సులు స్తనంబులును ధర్మశాస్త్రంబులు హృదయంబును న్యాయశాస్త్రంబులు బాహువులును సాంఖ్యద్వయంబు కర్ణద్వయం బును శిక్షాద్యంగంబులు శీర్షంబును వహ్ని వక్త్రింబును మీమాంస లక్షణంబును నాథర్వణశ్రుతి చేష్టయు బ్రహ్మ శిరస్సును రుద్రుండు శిఖయు విష్ణుం డాత్మయు నై ప్రకాశింపుచుండు,దీనికిసూక్ష్మశరీరంబు

20 రాయవరపు గవర్రాజుగారు, మూలపేట.

21 జువ్వులూరి వెంకటరత్నంగారు వకీలు, గుంటూరు.

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు

## ఈ నెలసొమ్ము చెల్లించిన చందాదారులు.

1 ఇరుకుళ్ళ వెంకయ్యగారు, సిరిసిళ్ళ.

2 అక్కిరాజు శంకరయ్యగారు, విలేజిమున్సిఫ్, మాధవరం.

3 కొండపల్లి సుందరరామయ్యగారు, కరణం, వేమవరం.

4 బావిశెట్టి నారాయణస్వామిగారు, విలేజిమున్సిఫ్, రావిపాడు.

5 కొండా భోగిభూషణరావుగారు, చినకొండ్రుపాడు.

6 రాచకొండ ఆంజనేయులుగారు, విలేజిమున్సిఫ్, చమళ్ళమూడి.

7 పెద్దిభట్ల కృష్ణమూర్తిగారు, స్పెషల్ రివిన్యూఇనస్పెక్టరు, దుగ్గిరాల.

8 పంచాగ్నుల సుబ్రహ్మణ్యంగారు, ప్లీడరు, కావలి.

9 వేదాంతం వెంకటేశ్వర్లుగారు, కుంచవరం.

10 పిరాట్ల సత్యనారాయణగారు, చింతపల్లి.

11 లంకా వెంకటనారాయణగారు, పందిరిపాలెం.

12 ఇయ్యుణ్ణి అనంతపద్మనాభదేశికాచార్యులుగారు, మోరి.

13 జోశ్యుల రామబ్రహ్మముగారు, ఫారెస్టు రేంజిక్లర్కు, క్రోసూరు.

14 విఠ్ఠలరావుగారు, తిమ్మాపురం.

15 పుతుంబాక సీతారామయ్యగారు, కొండూరు.

16 మండ చినవెంకయ్యగారు, దండమూడి.

17 కొడవటికంటి వెంకటప్పయ్యగారు, వాలంటీరుబదర్సు సబ్ ఏజంటు, నర్సరావుపేట.

18 కాటూరు వెంకటకనకదుర్గాప్రసాదరావుగారు, కాటూరు.

19 దేవరకొండ జగన్నాథరావుగారు, తాలూకాక్లర్కు, వినుకొండ.

20 సర్వజనమనోరంజనీ పుస్తకభాండాగారము, వానపాముల.

# అభినవసరస్వతి.

పత్రికాధిపతి జానపాటి పట్టాభిరామశాస్త్రి

ఇదియొక మాసపత్రిక - ఇందు ప్రాచీననవీనాంధ్ర ప్రబంధములును, నాటకములును, విమర్శనములును, విద్యావిషయిక మతవిషయిక వ్యాసములును ప్రకటింపఁబడును. ప్రాజ్ఞసమ్మతములగు తాత్కాలికవ్యాసములవలనఁగలుగు నానందముగాక చందాదారులకు సంవత్సరమునకు 2-8 అపూర్వగ్రంథములు అలవడును. చందా సం॥ 1కి రు 2-0-0

## ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

1 అళ్వయాచార్యవిజయము ... ... 0-4-0
2 కరిణీకోద్ధారిణి (పూరెవీరభద్రకవి) ... ... 0-4-0
3 వాసంతికా పరిణయము } ఇవి రెండు నాటకములు. ... 0-4-0
4 కంసవధము ... 0-8-0
5 చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) ... 0-4-0
6 విరూప తుకీరగురుపరంపర ... ... 0-2-0
7 నీతిగీతులు (సుమతి శతకమునకు సంస్కృతము) ... 0-2-0
8 విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము ... 0-2-0
9 విగ్రహారాధనఖండనఖండనము ... ... 0-4-0
10 చిత్తూరిజిల్లా తీర్పువిమర్శనము (పత్రికాధిపతి) ... 0-4-0
11 సంగదోషము ... ... 0-3-0
12 వీరభాగవతము (ముదిగొండవీరభద్రకవి) ... ... 1-4-0
13 పుళిందావివాహము (పత్రికాధిపతి) ... ... 0-4-0
14 గురిగింజ, వత్సలనీతిశతకము, వ్యాసనిష్కాసనము, పిష్టపేషణము ... 0-4-0
15 శివానందలహరి తంగెడె రామకృష్ణకవి) ... ... 0-4-0
16 లక్ష్మీవిలాసము (రాయసము వెంకటపతి) ... ... 0-4-0
17 నర్సారావుపేట శతావధానము (తిరుపతి వేంకటీయము) ... 0-8-0
18 పశ్యాంపశ్యాం " ... ... 0-2-0
19 పశ్యశబ్దవిచారము " ... ... 0-2-0
20 పురశ్చరణము " ... ... 0-2-0
21 అత్యద్భుతవిమర్శనము, (ఇది వెంకటరామకృష్ణకవుల అవధానముల పైవిమర్శనము) ... ... ... 0-5-0
22 శంతనురాజచరిత్ర ... ... ... 0-14-0
23 రజస్వలావివాహఖండనము ... ... ... 0-8-0

అభినవసరస్వతీ కార్యస్థానము
జానపాడు-పిడుగుళ్ళపోష్టు, గుంటూరుజిల్లా.